# అక్షర చిత్రాలు



కూర్పరి:

ద్వా.నా. శాస్త్రి

ఎం.ఏ., ఎం.ఫిల్., పి హెచ్.డి., డి.ఎల్.
తెలుగు లెక్చరర్





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# అక్షర చిత్రాలు



కూర్పరి:

ద్వా.నా. శాస్త్రి

ఎం.ఏ., ఎం.ఫిల్., పి హెచ్.డి., డి.ఎల్.
తెలుగు లెక్చరర్





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# రెండు ముక్కలు

గత పదేళ్లుగా ఎన్నో ఊర్లు తిరిగి, ఎన్నో గ్రంథాలయాలు దర్శించి, ఎంతమందినో కలుసుకొని, కొందర్ని ఉత్తరాల ద్వారా బాధించి సాహితీరంగానికి సంబంధించిన ఎనభై ఫోటోల్ని సేకరించగలిగాను. వాటిలో అరవై చిత్రాలను ఎన్నిక చేసి "అక్షరచిత్రాలు"గా వెలువరిస్తున్నాను.

వీటిని ఆంధ్రభూమి 'అక్షరం'లో ప్రచురించిన ఆర్.వి. రామారావు గారూ, ఆంధ్రప్రభ - 'సాహిత్యప్రభ'లో ప్రచురించిన బుర్రా సుబ్రహ్మణ్యంగారూ నా శ్రమను గుర్తించి ప్రోత్సహించారు. వారిద్దరికీ ధన్యవాదాలు.

ఈ ఫోటోల్ని పుస్తకంగా తీసుకురావటం ఎలాగా అని సతమతమవుతున్నప్పుడు "మేము వేస్తాం" అన్నారు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు. అందుకు శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగార్కి నేను ఋణపడి ఉన్నాను.

ఈ "అక్షరచిత్రాలు" సేకరణ మాత్రమే. నా స్వోపజ్ఞ ఏమీ లేదు. ఈ ఫోటోల సేకరణలో ఎందరో తోడ్పడ్డారు. ఎన్నో గ్రంథాల నుంచి రీకాపీ చేశాను. ముఖ్యంగా గౌతమీ గ్రంథాలయం బాగా ఉపకరించింది. ఈ విషయంలో సహకరించిన వారందరకూ నా కృతజ్ఞతలు.

ఈ విధంగా తెలుగులో పుస్తకం రావటం ఇదే ప్రథమం. ఈ రకం ప్రచురణలు ఎన్నో వస్తాయనే ఆశతో....


ద్వా.నా. శాస్త్రి

ఎం.ఏ, ఎం.ఫిల్, పి హెచ్.డి., డి.ఎల్.
తెలుగు లెక్చరర్
S.K.B.R. కళాశాల
అమలాపురం - 533 201


156
2-93





ఈ ఫొటోలో ఉన్న ముగ్గుర్నీ గుర్తు పట్టడం కష్టమే! ఈ ముగ్గురూ కవివీరులే! విశాఖ మండలాన్ని సాహితీపరంగా ఒక ఊపు ఊపిన ఒక సాహిత్య సంస్థను స్థాపించింది వీరే! వీరు స్థాపించిన సాహిత్య సంస్థకి "కవిగారు"గా పేరొందిన మారేపల్లి రామచంద్ర శాస్త్రి గారు శాశ్వత అధ్యక్షులుగా ఉండేవారు. పురిపండా అప్పలస్వామి గారు కార్యదర్శిగా ఉండేవారు. ఇంతకీ ఆ సాహిత్య సంస్థ పేరు - కవితా సమితి. దీని జననం 1926 మే 6న! కవితా సమితిలో ఆచంట సాంఖ్యాయన శర్మ, గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, తాపీ ధర్మారావు, ఆరుద్ర, శ్రీరంగం నారాయణ బాబు, కొంపెల్ల జనార్ధనరావు వంటి హేమాహేమీలు సభ్యులుగా ఉండేవారు.

అటువంటి ఘనత వహించిన 'కవితా సమితి'ని స్థాపించిన పై ఫొటోలో గల ముగ్గురు - ఎడమనుంచి

పురిపండా అప్పల స్వామి

శ్రీ శ్రీ

వడ్డాది సీతారామాంజనేయ కవి





★

"భాగవతం రాసిందెవరండీ... ?"
"వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు కదూ?"

ఇటువంటి సంభాషణలకు కారణం ఆరోజుల్లో భాగవతం, రామాయణం మొదలైన గ్రంథాల్ని అచ్చువేసిన వావిళ్ళ రామస్వామి శాస్త్రి గారి పేరు ముద్రాపకులుగా అట్టమీద ఉండటం! తెలుగు సాహిత్య ప్రచురణకు వావిళ్ళ వారు చేసిన కృషికి తెలుగు వారు ఎప్పుడూ ఋణపడే వుంటారు. ఎన్నెన్ని సాహిత్య గ్రంథాలను వెలుగులోకి తెచ్చారో! అందుకే సి.పి. బ్రౌను మహాశయుడు "చేతి వ్రాత పుస్తకములు చదువుకొనే రోజుల్లో శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు ముద్రణాలయమును స్థాపించి చదువరుల కష్టముల విస్తరింప జేసిరి" అని ప్రశంసించాడు.

ఆదిలో హంసపాదు లెదురయినా వావిళ్ళవారు "ఆది సరస్వతీ ముద్రాలయము" స్థాపించి 1854-62 మధ్య ఏభై పుస్తకాలు పైగా ప్రచురించారు. వారు మరణించగానే కుమారులు వెంకటేశ్వర శాస్త్రులు 1906లో 'ఆది సరస్వతీ ముద్రణాలయం' పేరును 'వావిళ్ళ ముద్రణాలయం'గా మార్చి పుస్తక ప్రచురణ చేపట్టారు. పై చిత్రం మద్రాస్‌లోని ఒకప్పటి వావిళ్ళ ప్రెస్ భవనం!

★







ఈ ఫొటోలోని ముగ్గురూ ముగ్గురే! నేటి మేటి కవులు - ఆనాడు ఇలా ఉన్నారు! ఈ ఆధునిక కవిత్రయాన్ని గుర్తుపట్టారా? ఎడమనుంచి--

"ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని"

అని గర్జించిన అభ్యుదయ కవి వీరుడు - డాక్టర్ దాశరధి!

"శక్తి సముద్రా!
చైతన్యానికి వ్రాలు ముద్రా!
సాహిత్య ఋషీ!"

అని బాపు రమణలచే కితాబునందుకొన్న కవి + పరిశోధకుడు అయిన భాగవతుల శంకరశాస్త్రి - ఆరుద్ర!

"భాషే నేను తెచ్చుకొన్న తీయని వరం
భాషే నేను కట్టుకున్న జీవన గోపురం"

గా భావించి కవితరాయనిదే నిద్రపోని సాహిత్యజీవి - తెలుగు వారికి మరో జ్ఞాన పీఠం తెచ్చిపెట్టిన ఆచార్య సింగిరెడ్డి నారాయణ రెడ్డి - సినారె!







ఆయన రాజారామమోహన రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహదేవ గోవిందరానడేల కోవకు చెందిన ఆంధ్రుడు. ప్రముఖ భారతీయులలో ఒకడు.
లోతైన వివేచనా, అంతులేని సాహసం, అపారమైన ధీ శక్తి ఆయనకు సొత్తులు.
ప్రగతి మార్గాలకోసం పోరాడిన మనీషి ఆయన.
— ఈ విధంగా ఎందరో ఆయనను ప్రశంసించారు.
ఆయన — ఎవరో కాదు 16-4-1848 లో జన్మించిన కందుకూరి వీరేశలింగం పంతులు గారు!
ఈ ఫొటోలో కనిపించే ఇంట్లోనే వీరేశలింగం గారు జన్మించారు. స్వ గృహం గురించి తమ స్వీయచరిత్రలో ఇలా రాసుకున్నారు—
"మా ఇల్లు రాజమహేంద్రవరంలోనున్న పెద్ద ఇండ్లలో నొకటి. దానితో సమానమైన ఇండ్లా పట్టణములో రెంటి మూటికంటె నధికముగా లేకుండెను. నేను జన్మించిన గది నాపాలికి వచ్చిన మేడ ఇంటిలోనే యుండి నాయధీనములోనే యున్నది. నా రాజశేఖర చరిత్రమునందలి రాజశేఖరుడు గారి గృహవర్ణన యించుమించు మా గృహవర్ణనమే!"

అటువంటి సంఘసంస్కర్తయైన కందుకూరి వారి ఇల్లు శిథిలావస్థలో ఉండటం ఆంధ్రుల వెధవాయిత్వానికి మచ్చుతునక! కొందరు ఆ ఇంటిని సంరక్షించాలని తపనపడుతున్నారు. సానుకూలిస్తుందో లేదో! మరి ఇదే మరో రాష్ట్రంలోనో మరో దేశంలోనో అయితే..... ? ఇలా అధోగతిలో ఉండదని వేరే చెప్పాలా?







విశాఖపట్నంలో ఆరుట్ల రామదాసు నాయుడు గారనే భూస్వామి ఉండేవారు. వారు రెండు ఎకరాల స్థలాన్ని స్వాతంత్ర్య సమరయోధులు, సంఘ సంస్కర్త, పండితులు అయిన మారేపల్లి రామచంద్ర శాస్త్రి గారికి ఇచ్చి (కవిగారుగా ప్రసిద్ధులు) "ధర్మాశ్రమము" స్థాపించుకోమన్నారు.

ధర్మాశ్రమం అంటే—

విశాఖలోని ఎన్నెన్నో సంస్థలకి, సభలకి, ఉద్యమాలకి ఆటపట్టు. తెలుగునాట తొలి గ్రంథాలయంగా పేరుపొందిన 'ఆది సరస్వతీ నిలయం' ఆనంద గజపతి గ్రంథాలయంగా ఇక్కడే మార్పు చెందింది. నాటక శాలగా, కుటీర పరిశ్రమలకు నిలయంగా ఉండేది. కాంగ్రెసు కార్యకలాపాలకు రహస్య ప్రదేశం ఇది!

"అర్ధ శతాబ్దం పాటు విశాఖ సంస్కృతికి అభినయరంగంగా వున్న ధర్మాశ్రమం ఈనాడు రూపురేఖలు లేకుండా పోయింది" అని పురిపండా అప్పలస్వామి గారు ఆవేదన చెందారు. పై చిత్రమే ఆనాటి ధర్మాశ్రమం!

కుర్చీలో కూర్చున్నవారు - మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు (కవిగారు) కుడిప్రక్కన గల ముగ్గురిలో మధ్యన ఉన్నవారు పురిపండా వారు. ఆయనకు ఎడమవైపున జయంతి సుబ్బారావుగారు కూర్చున్నారు. ఫొటోలో ఎడమవైపున ఒంటరిగా కూర్చున్నది - కవిగారి కుమారుడు









"వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడో తెల్పుడే"

అనే జాతీయ గీతం ద్వారా ప్రజల్ని చైతన్యవంతం చేసిన వారు 'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరి. ఈ కవివీరుడు పద్యాలలో సంప్రదాయంలోని మౌఢ్యాన్ని, అగ్రకులాల అన్యాయాల్ని ఎలుగెత్తి చాటాడు.

గంగానదీ తీరాన తపస్సు చేసుకుంటున్న సూత మహర్షితో త్రిపురనేని వారు వాగ్వాదానికి దిగారు. భగవంతుడు, పురాణాలు, స్వర్గ నరకాలు మున్నగువాటి పేరు మీదుగా జరిగే అనాచారాలను, అన్యాయాలను, సూతునికి ఏకరువు పెట్టి ఆయన చేత అంగీకరింప జేశారు. ఇదే "సూత పురాణం"గా ప్రచురితమైంది. ఈ గ్రంథం చెళ్ళపిళ్ళ, వేలూరి వంటివారి ప్రశంసలు కూడా పొందింది.

తెనాలిలో త్రిపురనేని రామస్వామి గారి ఇల్లే "సూతాశ్రమం". నాస్తికులు, ఆస్తికులూ అందరూ ఈ ఆశ్రమానికి వచ్చి చర్చలు, వాదోపవాదాలు చేసేవారు. శాంత స్వభావంతో తిరిగి వెళ్ళేవారు. హేతువాద ఉద్యమానికి స్ఫూర్తి నిచ్చిన సూతాశ్రమాన్ని పై ఫొటోలో చూడవచ్చు. సంప్రదాయ వ్యతిరేకంగా ఉద్యమించి సంప్రదాయమైన 'సూతాశ్రమం' పేరును పెట్టడం విశేషం!







ఇది ఒకనాటి అపూర్వ కలయిక!

ఒకతను ఆంధ్రదేశాన్ని 'పెద్ద బాలశిక్ష'గా, కార్ల్‌మార్క్స్, ఫ్రాయిడ్‌లను 'సులోచనాల జోడు'గా – తెలుగు కవిత్వాన్ని ఒక మలుపు తిప్పిన మహాకవి!

మరొకతను కవి. కవిని మించిన పరిశోధకుడు. అక్షరాలా 'వ్యాసుడు'! ఈయనగారి కవిత్వాన్ని చూసిన మరొకతను "నేనింక కవిత్వం రాయక్కర్లేదు" అని కూడా అనేశాడు. పై ఫొటోలో కనిపించే ఆ ఇద్దరూ బంధువులు కూడా! ఇద్దరూ సినీ కవులే!

వీరిద్దరిమధ్యా సాహితీ వైరం ఏర్పడింది. కొందరా వైరానికి ఆజ్యం పోశారు.

అయితే ఆ వైరం వల్ల శ్రీరంగం నారాయణ బాబు వెలుగులోకి రావటం అనే మేలు జరగకపోలేదు.

ఇంతకీ – వీరిద్దరూ........

శ్రీరంగం శ్రీనివాసరావు అనే శ్రీ శ్రీ భుజంపై ముఖం పెట్టి అభిమానాన్ని ప్రదర్శిస్తున్న వారు – ఆరుద్ర!!







ఈ ఫొటోలో కనిపించేది 9వ శతాబ్దం నాటి – మూడవ చాళుక్య విష్ణువర్ధనుని - అహదన కరతామ్ర శాసనం.

ఈ శాసనం మొత్తం నాలుగు రేకులలో రెండు ప్రక్కలా రాసి ఉంది. 17 వరసలు సంస్కృతంలో ఉండగా 17వరసలు తెలుగులోనూ ఉన్నాయి. నాల్గవ రేకు మొదటివైపున రాసిన తెలుగులిపి ఫొటోలో కనబడుతుంది.

ఆనాటి తెలుగు లిపి ఎలా వుందో పై చిత్రం ద్వారా తెలుస్తుంది. ఈ తెలుగు లిపి గల శాసనాన్ని కె. వి. లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, ఫ్లీటు దొరగారు పరిష్కరించి పరిశోధించి ప్రకటించారు. పై లిపికి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వివరణ – రెండు లైన్లు పరిశీలించండి.

1వ లైను: మహాసత్త్వవల కొన్డుకలో నిరవద్య ప్రిధివి కవడిరజుళ్ గునవన మహా నభియుళ్
2వ లైను: యుద్ధ కంచి కొళ్ రమి స్వరాప్రిధివీ మహాసత్థన్ వళ్ అవజయ నువకొల కొన్డుకల్ కొర్విడికళ్





తెలుగులో గల ప్రసిద్ధ సాహిత్య సంస్థలలో 'సాహితీ సమితి' ఒకటి. రచయితలు, కవులు తమ పేర్ల ప్రక్కన బ్రాకెట్లో 'సాహితీ సమితి' అని వేసుకొని మురిసిపోయేవారు - అదొక గుర్తింపుగా భావించేవారు. అంతటి ప్రాముఖ్యంగల "సాహితీ సమితి" సభ్యులు గల పై ఫొటో సుమారు అరవై అయిదు సంవత్సరాల నాటిది. పై ఫొటోలో గల కవులు, రచయితలు:

కూర్చున్న వారు - ఎడమనుంచి:

1. కొమాండూరి కృష్ణమాచార్యులు 2. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి
3. పెద్దిభొట్ల పూర్ణశర్మ 4. కొప్పర్తి నారాయణ మూర్తి
5. చింతా దీక్షితులు.

నిల్చున్నవారు - మొదటి వరుస (ఎడమనుంచి)

1. నోరి నరసింహశాస్త్రి 2. వఝ్ఝ బాబూరావు 3. మునిమాణిక్యం నరసింహారావు
4. మొక్కపాటి నరసింహ శాస్త్రి

నిల్చున్నవారు - రెండవ వరుస:

1. దేవులపల్లి 2. వేదుల







సమాజాన్ని అభ్యుదయ పథంవైపు నడిపించి ప్రజల్ని ఉత్తేజితుల్ని చెయ్యటంలో 'ప్రజానాట్య మండలి'తో పోటీకి వచ్చే సంస్థలేదని చెప్పవచ్చు.

అటువంటి ప్రజానాట్య మండలి సంస్థ "మాభూమి" నాటకాన్ని ఒకే సంవత్సరంలో వెయ్యి ప్రదర్శనలు ఇచ్చి ఘనత వహించింది. కె.ఎ. అబ్బాస్ ఈ ప్రదర్శన చూసి ఉప్పొంగిపోయాడు.

"మాభూమి నాటకంలో ప్రతి పాత్రా అగడ్డలో (అంటే తెలంగాణాలో) పుట్టి పెరిగిన జీవితాలు. వాస్తవికమైన పాత్ర చిత్రణ - వారిలో వున్న అవినాభావ సంబంధం - తెలంగాణా యాస - మృదుమధురమైన మాండలిక సొగసులతో 'మాభూమి' నాటకం ఒక మహాకావ్యంగా నిలబడింది. అన్ని వర్గల వారూ ఈనాటకాన్ని చూసి ఉత్తేజితం పొందారు" అంటారు కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.

పై ఫొటోలో కనిపించే దృశ్యం 1947లో బొంబాయిలో ప్రదర్శించబడిన 'మాభూమి' నాటకంలోది. "ఆంధ్రుడా లేవరా" అనే పాట పాడుతున్నప్పటి దృశ్యం. కుడి నుంచి -- మిక్కిలినేని, కోసూరు పున్నయ్య, కోగంటి గోపాల కృష్ణయ్య, వట్టంశెట్టి ఉమామహేశ్వర రావులను చూడవచ్చు.







"ఆ మెరుపు కన్నె నా ప్రియురాలు, ఆమె
చంచల దృగంచలమ్ముల ఛాయలందె
నే విహరింతు, ఆమె కెమ్మోవి గాయు
లేత వెన్నెల కొరకు నే బలవరింతు...."

– ఇది వాడుక భాషాయోధుడు, అభ్యుదయ రచయిత, కవి అయిన పురిపండా అప్పలస్వామిగారు తొలి రోజుల్లో రచించిన "సౌదామిని" ఖండకావ్యంలోది. పై పాదాలకు ఆంగ్లానువాదం ఇలా సాగింది...

"Yon little lightning-girl is my beloved, I move
In the shadows of her gleaming looks;
I offer the gift of my life before
Her lips moonlight; I long
To hear her sweat nectar-voice..."

ఈ అనువాదం చేసింది – "Years ago, when I was a boy, Puripanda introduced my Telugu poems to the public. Now the wheel has turned full circle and here I am, presenting Puripanda in translation" అని 1-6-1947లో పలికిన శ్రీ శ్రీ. రాజమండ్రిలో అద్దేపల్లి అండ్ కో వారు ప్రచురించిన ఈ కావ్య సంపుటిలో పురిపండా, శ్రీ శ్రీ (వెనుకకు తిరిగి ఉన్నవ్యక్తి)ల విచిత్రమైన ఫోటో వుంది. అదే ఇది!







తెలుగు భాషా సాహిత్యాలకు, చరిత్రకు పుష్టిని చేకూర్చిన అచార్య త్రయాన్ని పై ఫోటోలో చూడవచ్చు. వేసిన పూలదండలు తీసివేయని సంప్రదాయంలో ఉన్న వీరు – ఎడమనుంచి

అధునిక యుగకర్త అనదగిన వారు, భావ కవితాయుగానికి వైతాళికులు, జాతీయకవి ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రాంతీయ భాషా సాహిత్యాధ్యయనాలను ప్రవేశ పెట్టడానికి కృషి చేసి - ఆంధ్రుల చరిత్ర-సంస్కృతిని అక్షరబద్ధంచేసిన విజ్ఞాన సర్వస్వ నిర్మాతలు అచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు.

సంప్రదాయ సాహిత్యానికి వెన్నెముకగా నిలిచిన మహా వక్త, విమర్శక శేఖరులు, ఏకసంథాగ్రాహులు - శిష్యవాత్సల్యానికి మారుపేరు అయిన ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారు.

రాయప్రోలు వారు, ఖండవల్లి వారు, దివాకర్ల వారు - ఈ ముగ్గురూ 1919 నుంచి 1973 వరకు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వరుసగా ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసి తెలుగు వెలుగును ప్రసరింపజేశారు.





1954, ఫిబ్రవరి 20వ తేది పద్య కవిత్వానికి సుదినం. ఆనాడు చారిత్రక విషయాలకు కావ్య గౌరవాన్ని కల్పించి నవ నవోజ్జ్వల స్వర్ణ రత్న భూషాకృతిగా రూపొందించబడిన - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి "ఆంధ్ర పురాణం" -

ఆవిష్కరింపబడిన రోజు అది. ఆనాటి అపురూప చిత్రమే ఇది!

ఎడమనుంచి —

ఆంధ్రపురాణ కృతిభర్త - దుగ్గుదుర్రు గ్రామనివాసి శ్రీ రేమెళ్ళ వేంకటరావు.

ఆ తర్వాత ఆంధ్ర పురాణ కర్త శ్రీ మధునాపంతుల. మూడవ వారు ఆంధ్ర పురాణాన్ని ఆవిష్కరించిన కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు.

ఉపన్యసిస్తున్నవారు విద్వత్ కవి వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు. సంప్రదాయాభిమానులు ముగ్గురు కూడిన సన్నివేశం ఇది!







వేదం వేంకటరాయ శాస్త్రి గారి 'ప్రతాపరుద్రీయం' నాటకం ఒకనాడు సంచలనం కలిగించింది. శ్రవ్య కావ్యంగానే కాదు – దృశ్యకావ్యంగా కూడా ఆ నాటకం ప్రాచుర్యం వహించింది. 1925 లో ప్రదర్శించబడిన 'ప్రతాపరుద్రీయం' లోని ఒక సన్నివేశాన్ని పై ఫొటోలో చూడవచ్చు.

ఇందులో మంత్రి యుగంధరునిగా నెల్లూరు నాగరాజ రావుగారు (మధ్యలో ఉన్నారు), జనార్దన మంత్రిగా డాక్టర్ బుర్రా శేషగిరి రావు గారు (ఎడమనుంచి మొదటివారు), విద్యానాథ మహాకవిగా రామాయణం సర్వేశ్వర శాస్త్రి (కుడినుంచి మొదటివారు) గార్లను చూడవచ్చు.

"మీరు ఈ వేరిగానిని రోగి ప్రతాపరుద్ర మహారాజును చేయవలసినది. ముందుగా, మహాకవీ! నీవు ఈ రాత్రి వీనిని రామావధానుల చావడి చేర్చవలెను" అని యుగంధరుడు విద్యానాధునితో సంభాషిస్తున్న దృశ్యం ఇది.







కవి, చిత్రకారుడు, సంగీత కోవిదుడు అయిన అడవి బాపిరాజు గారు "శశికళ" అనే ఖండకావ్యం రాశారు. అందులో నాయిక శశికళ. ఆ కావ్యసంపుటిలో "ఎండిమియాన్" అనే ఖండిక వుంది. బాపిరాజు గారు అజంతా లోయలలో విహారం చేస్తూ అక్కడి రమణీయ ప్రకృతి దృశ్యాలకి పులకించి పోయారు. మూడువేల సంవత్సరాల క్రితమే ఎండిమియాన్ అనే గ్రీకుబాలుడు ఆ లోయలో శశికళను ఆరాధించాడట! ఇప్పటి బాపిరాజుగారే అప్పటి ఎండిమియాన్! ఈ ఎండిమియాన్ గేయాన్ని రాసి బాపిరాజుగారు తన గురువైన కూల్డ్రే దొరకి పంపారు. కూల్డ్రే దొరగారు బాపిరాజుగారి ఎండిమియాన్ గేయం చదివి ముగ్ధులై గీసిన చక్కని చిత్రమే ఇది! ఈ చిత్రానికి దొరగారే "అజంతా లోయలో బాపిరాజు" అని శీర్షిక పెట్టారట!

"నిదుర పోయేనన్ను చూచీ
నాపై వాలిన నిన్ను చూచీ
గురువు కూల్డ్రే చిత్రం లిఖియించె"

అని బాపిరాజు గారే పేర్కొన్నారు.







'నటకావతంస', 'నటశేఖర', 'ఆంధ్ర బాల గంధర్వ' మొదలైన బిరుదులు ఎన్ని ఉన్నా -- తెలుగువారు మాత్రం 'స్థానం వారు' అనే ఆదరంగా పిలుచుకుంటారు. పౌరాణిక, చారిత్రక, సాంఘిక పాత్రలలో దేనినైనా సమర్థవంతంగా పోషించగల స్థానం నరసింహారావుగారిది చెరగని స్థానం.

చిత్రాంగి, మధురవాణి, రోషనార వంటి స్త్రీ పాత్రల్ని పోషించడంలో స్థానంవారు అందె వేసిన చెయ్యి. అక్షరాలా స్త్రీ మూర్తిలా భ్రమింపజేసే నటనవీరిది.

పై ఫొటోలో అచ్చంగా ఒక స్త్రీయే పాత్ర వేసినట్టుగా అనిపించే 'రోషనార' పాత్రలో పద్మశ్రీ స్థానం నరసింహారావు గారిని చూడవచ్చు.





పై ఫొటోలోని వ్యక్తి నటుడు కాదు. ఇదొక వేషమూ కాదు. సుందరవిగ్రహునిగా, అపరభోజరాజుగా పేర్గాంచిన రాజా వారిని ఈ చిత్రంలో చూడవచ్చు.

ఈ రాజావారు ఆంధ్రాంగ్ల ఉత్కళ భాషలలో ప్రవీణులు. దానశీలురు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు పోషకులలో ఒకరు. శ్రీనివాసకల్యాణం, మానవతీ చరిత్రము, బాలగోపాలశతకం వంటి పద్య రచనలు చేసిన కవికూడా. పింగళిసూరన 'కళా పూర్ణోదయం' కావ్యాన్ని ఉత్కళ భాషలోకి అనువదించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వైజ్ఞానిక విభాగాన్ని ఏర్పరచటానికి దోహదం చేసిన ఈయన - జయపురం రాజా విక్రమ దేవవర్మ గారు!







“ఇది నిజముగా కల్ప వృక్షము వంటిది” అని చిలకమర్తి వారిచే ప్రశంసపొందిన గ్రంథాలయాన్ని పై ఫొటోలో చూడవచ్చు. 1918లో నూరు గ్రంథాలతో, అయిదు పత్రికలతో ప్రారంభించబడిన ఈ గ్రంథాలయంలో ఈనాడు సుమారు ఏభై వేలకు పైగా గ్రంథాలున్నాయి. దిన, వార, మాస పత్రికలు డెబ్బయి అయిదు వరకు ఉన్నాయి.

విజ్ఞాన సౌరభాన్ని ఏడు దశాబ్దాలుగా వెదజల్లుతూ - గ్రంథాలయోద్యమానికి చిహ్నపతాకగా నిలిచిన ఈ గ్రంథాలయం ప్రకాశం జిల్లాలో వేటపాలెంలో గల “సారస్వత నికేతనం”. ఈ సారస్వత నికేతనాన్ని భాషా పోషక శ్రీ ఊటుకూరి సుబ్బరాయ శ్రేష్ఠిగారు స్థాపించారు. ఈ గ్రంథాలయాన్ని మహాత్మాగాంధీ, బాబూ రాజేంద్ర ప్రసాద్, చెళ్ళపిళ్ళ; కాశీనాధుని నాగేశ్వరరావు వంటి మహామహులు దర్శించి ప్రశంసించారు. పరిశోధకులకీ సాహిత్యాభిమానులకీ వేటపాలెం గ్రంథాలయం నిజంగా కల్పవృక్షమే!







సాహిత్య సభల్లో కొన్ని గుర్తుండేవి – మరికొన్ని తప్పకుండా గుర్తుపెట్టుకోదగినవి ఉంటాయి. ఈ పై ఫొటో తప్పకుండా గుర్తుపెట్టుకోదగిన అక్షరచిత్రం!

పై ఫొటోలో కనిపించే ఇద్దరూ ఇద్దరే!

కవిత్వాన్ని బంగారంగా భావించిన కవి ఒకరయితే కవిత్వాన్ని అంగారంగా భావించిన కవి మరొకరు.

"కవిత్వము ఛందస్సులోనే వ్రాయవలయును" అని ఓ కవి అంటే -- రెండో కవి ఛందస్సుల సర్ప పరిష్వంగం వదిలేస్తానంటాడు.

ఆధునిక విమర్శకులకు ఇద్దరూ ఆశ్చర్యార్థకాలే! ఈ ఉత్తర, దక్షిణ ధృవాలు విశ్వనాథ, శ్రీశ్రీ అని వేరే చెప్పక్కర్లేదు.

ఇద్దరికీ పరస్పరం గౌరవం, వాత్సల్యం ఉన్నాయి - సిద్ధాంతాలలో వైరుధ్యమూవుంది. తెలుగులో గొప్ప కవిత్వం రాసిన -- విశ్వనాథ శ్రీశ్రీల అపూర్వ కలయిక ఇది!







ప్రసిద్ధులైన కవులు, నవలా రచయితలు, విమర్శకులు, పత్రికా సంపాదకులు, కథకులు అంతమంది పాల్గొనే దృశ్యం అరుదుగా లభిస్తుంది. అటువంటి అరుదైన చిత్రమేఇది!

1982లో తెనాలిలో డాక్టర్ కొత్త రవీంద్రబాబుగారి నవల "జలకన్య" ఆవిష్కర, అంకితం జరిగింది. ఆనాటి ఫోటో ఇది.

ఇన్‌షర్ట్ వేసుకొని చూస్తున్న ప్రముఖ కథకులు, సంపాదకులు వీరాజీ గార్కి జలకన్య అంకితం ఇచ్చారు. వీరాజీ గార్కి కుడివైపున పుష్ప గుచ్ఛం పట్టుకొని నిల్చున్నవారు ప్రసిద్ధ సంపాదకులు - రచయిత పురాణం సుబ్రహ్మణ్య శర్మ గారు. వీరాజీ గారి ఎడమవైపున శ్రీమతి లక్ష్మి రఘురామయ్య, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ కొండముది శ్రీరామ చంద్రమూర్తి, (ఆ తర్వాత వ్యక్తిని వదిలేస్తే) సంజీవ దేవ్, స్వాతిబలరాం, అమరేంద్రలను చూడవచ్చు.







కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలోని కవులు, పండితులు పద్దెనిమిదేళ్ళ క్రితం సోమసుందర్-తో తీయించుకున్న ఫొటో ఇది - ఇందులో ఎడమనుంచి--

వృషభ పురాణం - ఆరె జానపద గేయాలతో ప్రసిద్ధి పొంది - అభ్యుదయానంతర కవిత్వ ధోరణులు అనే పుస్తకంతో రచ్చకెక్కిన ఆచార్య పేర్వారం జగన్నాథం.

వైవిధ్యం, వైలక్షణ్యం కలిస్తే కవిత్వం అని నమ్మే కవి ప్లస్ విమర్శకుడు డాక్టర్ మాదిరాజు రంగారావు.

వయసు మీదపడినా మాటపడని - వాడి వేడితగ్గని కవి, విమర్శకుడు, కథకుడు - సోమసుందర్.

సంప్రదాయ సాహిత్యాన్ని పుక్కిట బట్టి విప్లవ పంథాను ఎంచుకొనే ఆచార్య కేతవరపు రామకోటి శాస్త్రి, చేతనా వర్తకవిగా - సంప్రదాయ విమర్శకుడిగా ప్రతిష్ఠ పొందిన ఆచార్య సుప్రసన్న.







ఆధునిక కవులలో 'అనితర సాధ్యం మామార్గం' అనుకుంటూ 'నవ్వి పోదురుగాక మాకేటి వెరపు' అనే రీతిలో కవిత్వం రాసే కవుల్ని పై ఫొటోలో చూస్తారు. చర్చకి ఎప్పుడూ అవకాశమిచ్చే ఈ ఇద్దరూ--

పాశ్చాత్య సాహిత్య ప్రభావం నేపథ్యంగా అర్థమ్మ్ము గాని గీతాలతో స్వీయానుభవాన్ని కొత్తగా - గమ్మత్తుగా వర్ణించడం, నేను సామాజిక అభ్యుదయం కోసం రాయటంలేదని చాటడం - తెలుగు కవిత్వాన్ని ఆంగ్లేయులకి పరిచయం చేయటం వంటి లక్షణాలతో విలక్షణ కవి అనిపించుకున్న-'మో'-వేగుంట మోహన్ ప్రసాద్ కవితా పఠనం చేస్తున్నారు.

అస్పష్టతను స్పష్టంగా రాయగల కవిగా — అనుభూతి కవిత్వంలో అగ్రజునిగా — రాజకీయాలంటే గిట్టవంటూ చెప్పే "చెట్టు కవి"గా పేరు పొందిన ఇస్మాయిల్ వేగుంట ప్రక్కన కూర్చున్నారు. విజయవాడలో గల 'విజయ సాహితి' సంస్థ ఈ ఇద్దరి కవులతో సభ ఏర్పాటు చేసినప్పటి దృశ్యం ఇది.







"ఔర్ జగత్ నే ఔర్ జగత్ నే
ఔర్ జగత్ నే దే అవాజ్
బఢే చలో రే బఢే చలో రే"

అని శ్రీ శ్రీ మహాప్రస్థానాన్ని హిందీలోకి అనువదించారు డాక్టర్ సూర్యనారాయణభాను. శ్రీ శ్రీ కవితలలో కొన్నిటిని 1972లో "తెలుగు కె లోక్ ప్రియ్ కవి శ్రీ శ్రీ" గా హిందీలోకి అనువదించారు. కేంద్ర ప్రభుత్వం తరపున ఉత్తర ప్రదేశ్‌లో వివిధ సభలలో శ్రీ శ్రీ కవితల్ని భానుగారు చదివి వినిపించినపుడు శ్రోతలు హర్షధ్వానాలు చేశారట! మన శ్రీ శ్రీని ఆంధ్రేతరులకు బాగా పరిచయం చేసిన డాక్టర్ భానుగారిని మన తెలుగు ప్రభుత్వం పట్టించుకోలేదని ప్రత్యేకించి చెప్పక్కర్లేదుగదా! ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం భానుగారి కృషికి బహుమతి ఇచ్చింది. ఆనాటి ఉత్తర ప్రదేశ్ గవర్నరు శ్రీ మీర్ అక్బర్ అలీ ఖాన్ గారి చేతుల మీదుగా బహుమతి అందుకుంటున్న డాక్టర్ సూర్యనారాయణ భానుగారిని పై ఫొటోలో చూడవచ్చు.







తెలుగునాట ఒకనాడు కవి సమ్మేళనాలకు మంచి ఆదరణ లభించేది. ప్రాచీన ఆధునిక కవులతో 1949 లో జరిగిన విశిష్ట కవిసమ్మేళన దృశ్యాన్ని పై ఫొటోలో చూడవచ్చు. ఇందులో ఉన్న అతిరథమహారథులు - ఎడమనుండి

1. తల్లావజ్ఝల శివ శంకరశాస్త్రి (స్వామి శివశంకరులు)
2. తుమ్మల సీతారామమూర్తి (శాస్త్రిగారి వెనకాల)
3. రాయప్రోలు సుబ్బారావు
4. విశ్వనాథ 5. తాపీ ధర్మారావు 6. కాంచనపల్లి కనకాంబ
7. అయ్యగారి వీరభద్రరావు 8. గుర్రం జాషువా (వెనక ఉన్నవారు)
9. అప్పటి ఆస్థాన కవి (శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి)
10. కాటూరి వెంకటేశ్వర రావు (శ్రీ పాదవారి వెనకాల)
11. బెల్లంకొండ రాఘవరావు (వెలకాల వున్న వారు)
12. ఉన్నవ లక్ష్మీనారాయణ
13. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ
14. వేలూరి శివరామ శాస్త్రి (రాళ్ళపల్లి వారి కుడి ప్రక్కన)
15. పింగళి లక్ష్మీకాంతం







వరకట్నానికి ఈ "ఖర్మభూమి"లో ఎంతమంది బలి అయ్యారో లెక్కలు కట్టలేం. 1914లోనే వరకట్న పిశాచానికి ఆత్మార్పణం చేసుకొన్న స్నేహలతా కన్య వృత్తాంతం ఒక దిన పత్రికలో పడింది. ఆ వార్తను గజవల్లి రామచంద్రరావు గారు రాయప్రోలు సుబ్బారావుగారికి చదివి వినిపించారు. రాయప్రోలు వారు జ్వరంతో ఉన్నారు. అయన మనసు వికలమై పోయింది. వెంటనే "స్నేహలత" కావ్యాన్ని రచించగా కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు ప్రచురించారు. వరకట్నంపై ధ్వజమెత్తిన రాయప్రోలు వారి కరుణరసాత్మక కావ్యానికి ప్రేరకమైన కన్య - 'స్నేహలత'ను పై ఫొటోలో చూడవచ్చు. సామాజిక స్పృహ గల కవిత్వం ఎలా వుంటుందో స్నేహలత చదివితే తెలుస్తుంది. "ఆంగ్ల సారస్వతము నందలి జూలియట్టు వలె మృత్యువుకు ఈమె జంకలేదు" అంటారు రాయప్రోలువారు. వెంపరాల సుబ్రహ్మణ్యంగారు అదే ప్రాంతంలో 'స్నేహలత' అనే నాటకాన్ని రచించినట్టు తెలుస్తోంది.







కావ్యావిష్కరణోత్సవాలు తెలుగు వారికి క్రొత్త కాదు. ఇటీవల ఈ ఉత్సవాలు శృతి మించుతున్న దాఖలాలూ లేకపోలేదు. ఔచితీవంతంగా రంజుగా జరిగిన కావ్యావిష్కరణలలో పై ఫొటోలోని దృశ్యం ఒకటి.

ఫొటో మధ్యలో ఉన్న డాక్టర్ దాశరథి గారి "గాలిబ్ గీతాలు" ఆవిష్కరణ నాటి ముచ్చట ఇది.

ఇందులో దాశరథి గారి కుడిభుజంపై చెయ్యి వేసి నిలుచున్న ఆరుద్ర గారు కనిపిస్తారు. దాశరథి గారికి ఎడమవైపున టోపీ ధరించిన వారు బూర్గుల రామకృష్ణారావు గారు. ఆయన అప్పుడు మంత్రి కాబట్టి ఆవిష్కరణకు ఆహ్వానించలేదట - బూర్గుల వారికి ఉర్దూలోనూ తెలుగులోనూ మంచి పాండిత్యం ఉంది. కవితా హృదయంగల విమర్శకులు కూడా. ఆయనను గాలిబ్ గీతాల ఆవిష్కరణకు ఆహ్వానించటం ఔచిత్యం కాక ఏమవుతుంది? బూర్గులవారి ప్రక్కన సాహిత్యాభిలాషి నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు గారిని చూడవచ్చు.







శ్రీ కె. ఎన్. కేసరి --

ఈ పేరు అరవై ఏళ్ళ క్రితం సుప్రసిద్ధం. స్త్రీ జనపునరుద్ధరణ కోసం, స్త్రీల శక్తి సామర్థ్యాల్ని ప్రోత్స హించటం కోసం పూర్వుల వల్ల లభించిన ధనాన్ని, స్వయం కృషితో సంపాదించిన ధనాన్ని సద్వినియోగం చేసిన సంస్కర్త శ్రీ కె.ఎన్. కేసరి.

ఆయన స్థాపించిన "గృహలక్ష్మి" స్త్రీల పత్రిక ఆనాడు ప్రామాణికంగా వెలువడేది. మహిళారచయితలను, కవయిత్రులను వెలుగులోకి తెచ్చిన పత్రిక అది. కేసరిగారు ప్రతి సంవత్సరం ఒక విదుషీమణిని "గృహలక్ష్మి స్వర్ణ కంకణం" తో సత్కరించేవారు. ఆ సమ్మానం పొందటం ఒక గర్వకారణంగా భావించేవారు.

1952లో గృహలక్ష్మి స్వర్ణ కంకణాన్ని శ్రీ కేసరి గారి నుంచి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ గారు స్వీకరిస్తున్న దృశ్యాన్ని పై ఫోటోలో చూడవచ్చు. రుక్మిణమ్మగారు ఖండ కావ్యాలు, నాటకాలు, కథలు రాశారు. ఆవిడ రచించిన 'దేవీ భాగవతం' వచనరచన బాగా ప్రచారం పొందింది.







"This Encyclopaedia is literature. And it will live, if for nothing, for the imperishable beauty of its prose. I am confident that Balasurya Prasada Encyclopaedia in Telugu or as I would prefer to call it the Balasurya Prasada Andhra Vijnana Samhita, will live as long as Telugu lives as an effective factor in the composite structure of Hindu civilization.

— ఈ కితాబు ఇచ్చింది సర్ కట్టమంచి రామలింగారెడ్డి గారు. ప్రఖ్యాతిగాంచిన జమీందారుల కుటుంబం నుంచి వచ్చి - కేవలం ఒక్క చేతి మీదుగా "ఆంధ్ర విజ్ఞానము" అనే విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించడం సామాన్య విషయం కాదు. 1938 ప్రాంతంలో - శ్రీ ఇజ్జాత్ అసార్ కందుకూరి బాలసూర్య ప్రసాదరావు బహద్దూర్-దేవిడే జమీందార్‌గారు - అటువంటి అసామాన్యమైన పనిని చేపట్టి సఫలీకృతులయ్యారు. ఆయన నిర్మించిన "ఆంధ్ర విజ్ఞానము" కాకినాడలో శ్రీ లక్ష్మి ప్రింటింగ్ వర్క్సులో ప్రచురితమైంది. దీనికి శ్రీ సి.ఆర్. రెడ్డి ముందుమాట రాశారు. ఆంధ్ర విజ్ఞానకర్తయైన శ్రీ బాలసూర్య ప్రసాదరావు జమీందారు గారిని ఈ ఫొటోలో చూడవచ్చు.







ఈ ఫొటోలో కనిపించే ఇద్దరూ వచన రచనా ప్రవీణులే! వ్యంగ్యరచనలో ఆరితేరిన వారే!

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సంపదగల మేధానిధులే!

'ఆంధ్ర ఎడిసన్', 'ఆంధ్ర షేక్స్పియర్' అనే బిరుదులు ఒకాయనను వరించాయి.

మరొకర్ని 'ఆంధ్రాస్కాట్', 'ఆంధ్రామిల్టన్' అంటారు. ఒకాయనది 'సీతానగరం' స్వగ్రామం కాగా - 'ఖండవల్లి మరొకాయనకు స్వగ్రామం.

తెలుగులో వచన వాఙ్మయానికి పుష్టిని తుష్టిని చేకూర్చిన ఈ ఇద్దర్నీ గుర్తుపట్టలేదా?

ఎడమవైపున - శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు

కుడివైపున - శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు.

ఈ రెండు నరసింహాల అపూర్వ కలయిక 1935 ఏప్రిల్ 28న పిఠాపురంలో జరిగిన పానుగంటివారి సప్తతి పూర్త్యుత్సవం నాటిది!





# A GRAMMAR

OF THE

# TELOOGOO LANGUAGE,

*COMMONLY TERMED THE GENTOO,*

**PECULIAR TO THE HINDOOS INHABITING THE NORTH EASTERN PROVINCES**

OF THE

INDIAN PENINSULA

## *BY A. D. CAMPBELL,*

OF THE

*HONORABLE EAST INDIA COMPANY'S CIVIL SERVICE*

ON THE

MADRAS ESTABLISHMENT,

*MEMBER OF THE BOARD OF SUPERINTENDENCE*

FOR THE

## COLLEGE OF FORT ST. GEORGE.

MADRAS.

*Printed at the College Press*

*By M. Seshachellum*

1816

తెలుగు భాషాసాహిత్యాలకు పాశ్చాత్యులు చేసిన కృషికి మనం కృతజ్ఞులమై ఉండవల్సిందే. తెలుగు భాషకు సేవ చేసిన పాశ్చాత్యులలో అగ్రతాంబూలం సి.పి. బ్రౌన్‌కి దక్కుతుంది. ఆయనతో పాటు తెలుగు సేవ చేసిన వారిలో ముఖ్యుడు - కాంప్ బెల్ దొర (A.D. Campbell).

1816లోనే కాంప్ బెల్ తెలుగు వ్యాకరణం రచించటం గమనార్హం. ఇది కాలేజ్ ఆఫ్ ఫోర్ట్ సెయింట్ జార్జిలో గల ముద్రణాలయంలో ముద్రితమైంది. అప్పట్లో తెలుగును "తెలూగు" అనీ "జెంటూ" అనీ పిలిచేవారు. కాంప్ బెల్ రాసిన నిఘంటువును జయంతి రామయ్య పంతులుగారు ప్రశంసించారు. "ద్రావిడ భాషా వ్యాకరణము వ్రాసినట్టి కాల్డువెల్ దొర ద్రావిడభాషలు సంస్కృత భాషాజన్యములు కావని నిరూపించి వ్రాయుటకు పూర్వమే కాంప్ బెల్ దొర తన వ్యాకరణ మందా విషయమును ఉటంకించె నన్నచో కాంప్‌బెల్ దొర పరిశోధనా విజ్ఞానము మనకు తెలియును" అని ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారు ప్రస్తుతించారు.







ఇది ఆశ్చర్యం కలిగించే ఫొటో!

సంప్రదాయ కవిగా -- ఆధునిక కవిత్వం రుచించని పద్యకవిగా పేరొందిన 'సరస్వతీ పుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులు గారు అభ్యుదయ, విప్లవ కవితోద్యమాలకు నాయకుడైన - సంప్రదాయ కవిత్వానికి వ్యతిరేకియైన శ్రీశ్రీ చిత్రపటాన్ని ఆవిష్కరింపజేసిన పై చిత్రం వింతగా కనబడుతుంది.

శ్రీ శ్రీ చిత్ర పటానికి కుడివైపున ప్రసిద్ధ మార్క్సిస్టు విమర్శకులు రాచమల్లు రామచంద్రా రెడ్డి గారిని-

పటానికి కొంచెం వెనుకగా కడపజిల్లా రచయితల సంఘం కార్యదర్శి, ప్రముఖ రచయిత జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారిని చూడవచ్చు.

ఇటువంటి విశిష్ట కార్యక్రమాన్ని కడప జిల్లా రచయితల సంఘం ఏర్పాటు చేసింది.







"నిమ్మలూరు గ్రామంలో, దొడ్లో జామిచెట్టుమీద కూర్చొని వినీలాకాశం లోతుల్ని వర్ణ వైచిత్ర్యాన్ని దూరం నుండి వినిపించే సన్నని వేణు నాదాన్ని పక్షులు కిలకిలా పలుకరించుకుంటూ బహిర్గతం చేసుకొనే మానవులకు అర్థంకాని భావాల్ని ఉత్కంఠయై తర్కించుకొనే ఈ బాలిక విస్మయకారణమైంది" అని ఘట్టి ఆంజనేయ శర్మ గారన్నారు.

పై ఫొటోలో కనిపించే బాలిక ఎవరో కాదు – ఒక తరం పాఠకుల్ని సమ్మోహపరచిన నవలా రచయిత్రి!

"విశిష్టమైన పువ్వులకుండే తావి, మేలిమి బంగారం కుండే విలువ సంతరించి పుణికి పుచ్చుకున్న సార్థక నామధేయురాలు ఈమె! ఊహాంబర విహారి. స్వేచ్ఛాసాధకురాలు" అని విమర్శకులు ఆమె వ్యక్తిత్వాన్ని అంచనా వెయ్యటానికి ప్రయత్నించారు.

పై ఫొటోలో - జానకీరామకృష్ణ హేమలత గారున్నారు. అంటే 'లత' గారన్నమాట! 'బాలలత' గారి మధుర స్మృతి ఇది!









పై ఫొటోలో "మునుపటి రూల్సుకు కట్టుపడని" జంటకవులైన తిరుపతి వేంకట కవులని ప్రత్యేకంగా చెప్పక్కరలేదు. అయితే అసాధారణమైన ధారణా ప్రతిభ, అశు కవితా ప్రాభవం, సమయస్ఫూర్తి అ జంట కవులకి ఉపాసనా బలం వల్లనే సాధ్యమైందని చాలామంది అంటూ ఉంటారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే తిరుపతి వేంకట కవులే స్వయంగా - తమ కలాంటిదేమీ లేదని బల్లగుద్ది చెప్పడం. "శతావధాన సారము"లో రాసిన ఉపోద్ఘాతంనుండి వారి మాటల్లో చదవండి.

"మేమును గొంతమందితో నుపాసనా బలమనియే యొప్పుకొని వారిని సంతోషపెట్టు చుండుటయు గలదు. ఏమన, యథార్థము చెప్పినచో బొత్తిగా విశ్వసింపరు గదా! మున్నెవ్వరికేని యియ్యది యేయుపాసనము వలననైన లభించియుండునేమో మాకు దెలియదు గాని మాకు మాత్రమట్లు రాలేదని యథార్థముగా వక్కాణించు చున్నారము. ఇందులకు బుద్ధిబలము, సహజమైన యాశుధారయును, దానితోపాటు ధైర్య స్థైర్యములును పైని శాస్త్ర జన్య జ్ఞానాదికమును ముఖ్యకారణములు. అన్నిటికన్న నాశుధారయు ధైర్యస్థైర్యములును బుద్ధిబలమును మఱియును ప్రధానములు. ఇది మా యనుభవము.





పత్రికా సంపాదకులుగా, నాయకులుగా, సాహితీవేత్తగా - విశేషించి తెలంగాణా ప్రజాళికి వైతాళికుడిగా పేరొందిన బహుముఖ ప్రజ్ఞాశాలిని - ఆయన ధర్మపత్నిని పై ఫొటోలో చూస్తున్నారు.

గోల్కొండ పత్రిక - ఆంధ్రుల సాంఘిక చరిత్ర - హిందువుల పండుగలు అనే గ్రంథాలను సృష్టించిన సుర వరం ప్రతాపరెడ్డిగారే పై ఫొటోలో కనిపిస్తారు. ఆంధ్ర సారస్వత పరిషత్, విజ్ఞాన వర్ధినీ పరిషత్, శ్రీ శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం వంటి సంస్థలకు ఊపిరి పోసిన వారిలో సురవరం వారు ముఖ్యులు.

సురవరం ప్రతాపరెడ్డి గారు తల్లికి ఇష్టం లేకున్నా తాను ఇష్టపడిన పద్మావతీ దేవిని వంతం పట్టి వివాహమాడారు. ఫొటోలో కనిపించే పద్మావతీ దేవి గారి సహకారం రెడ్డిగారికి బాగా లభించినట్టు ఆయనే చెప్పుకొన్నారు. ఈ ఆదర్శ దంపతుల ఒకనాటి మధుర దృశ్యం ఇది!







ఈ ఫొటోలో కనిపించే మేధావి 1818-మే 5వ తేదీన జన్మించాడు. సమాజాన్ని జాగృతం చేసే కారణజన్ములలో ఈయన ఒకరు.

ప్రపంచం మీద తన సిద్ధాంతాల ప్రభావం కలిగించిన ఈ మనీషి అర్థికశాస్త్రవేత్త !

శ్రామిక వర్గ బంధువుగా - సోషలిజం ప్రవక్తగా ప్రపంచ మహాపురుషులలో ఒకడిగా జేజేలందుకొన్నారు.

ఈయన సిద్ధాంతం తెలుగు సాహిత్యాన్ని ఒక ఊపు ఊపింది - తెలుగు విమర్శకు కొత్త నెత్తురు ఎక్కించింది.
ఈయన వల్లనే మార్క్సిస్టు విమర్శ - మార్క్సిజం అనే మాటలు ప్రచారం పొందాయి.

ఇంతటి ప్రభావానికి కారకుడైన కారల్ మార్క్స్ 1861లో ఎలా ఉన్నాడో పై చిత్రంలో చూడవచ్చు.







ఎంత గొప్ప కవియైనా అన్ని కవితలూ గొప్పగా ఉండవు. ఎంత గొప్ప నటుడైనా ఎప్పుడూ గొప్పగానే నటిస్తాడని లేదు. ఈ సత్యాన్ని తెలిపే సంఘటనను తెలుసుకొందాం.

పై ఫొటోలో కనిపించే బందా కనకలింగేశ్వరరావు గారు మనకున్న గొప్ప నటుల్లో ఒకరు. తెలుగునాటక రంగంలో బందా వారి పేరు చిరస్మరణీయం కూడా. ఆకాశవాణిలో నాటక ప్రసారాలకు ప్రోత్సాహాన్ని ప్రాచుర్యాన్ని కల్పించింది కూడా ఆయనే. అటువంటి బందావారు 19-8-1943న బందరులో 'పాండవోద్యోగ విజయాలు' నాటకంలో కృష్ణునిగా వేసినప్పుడు నటనలో వైఫల్యం చెందారు. అప్పుడు అద్దంకి ధర్మరాజు పాత్రను, మాధవపెద్ది దుర్యోధనుని పాత్రను అభినయించారు. బందావారి నటనను కవిపాదుషా పువ్వాడ శేషగిరి రావుగారు కృష్ణా పత్రికలో ఈ విధంగా విమర్శించారు--

"చూడగా తిరుపతి వేంకట కవుల కృష్ణుడు ఒకటో, బందాకృష్ణుడు ఇంకొకటీ అని తోచింది. గ్రంథకర్తలు భారత కృష్ణుడు లీలామానుష విగ్రహుడని నాటకంలో చిత్రించగా బందావారు ధర్మరాజు కొలువులో కృష్ణుడు వినోదార్థం కుదురుకున్న విదూషకుడని నిరూపించారు. తిరుపతి కవుల పద్యాలు వచనాలుగాను, వచనాలు పద్యాలుగాను నిరంకుశంగా మార్చి పుక్కిలికి వచ్చిన శబ్దాలు గుదులు గుదులుగా మింగేసి ఒకేసారి కక్కేసే ప్రక్రియ ఆయన వాగ్రచనా చమత్కృతియంటారా? ఆయనగారు అడంగిలేకి కులుకులు చూపిస్తారేమిటండీ కృష్ణ పరమాత్మపాత్ర ధరించి?" (28.8.43 నాటి కృష్ణా పత్రిక)







కందుర్తి గారి "ఫ్రీవర్స్ ఫ్రంట్" నుంచి విడిపోయిన కేశవరావు, యాదవరెడ్డి, రాఘవాచారి, భాస్కరరెడ్డి, మన్ మోహన్ సహాయ్, కమ్మిసెట్టి వెంకటేశ్వరరావులు - నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్నలు పేర్లు మార్చుకొని ఆగ్రహ భార్గవులుగా – ప్రభువుల శిరసులపై పరశువులుగా అవతరించి "దిగంబర కవులు" అయ్యారు.

1965 లో ప్రారంభించబడిన దిగంబర కవిత్వోద్యమం ఇటీవలే రజతోత్సవం జరుపుకొంది. దిగంబర ఉద్యమం ఉవ్వెత్తున లేచి చతికిల బడిన కెరటమే అయింది. విప్లవ కవిత్వోద్యమానికి స్ఫూర్తినిచ్చిన దిగంబర కవుల్ని శ్రీ శ్రీ కొత్తలో ప్రోత్సాహమిచ్చారు. ఎడమనుంచి - జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండ రాజులతో శ్రీ శ్రీని ఈ ఫొటోలో చూడవచ్చు. దిగంబర కవిత్వం మరుగున పడినా సాహిత్య చరిత్రలో ఒక అధ్యాయాన్ని సృష్టించింది.



(పుట 67)

(పుట 77)



మనకు ఎన్ని సాహిత్య సంస్థలున్నా - అకాడమీలు ఏర్పడినా - విశ్వవిద్యాలయాలు వచ్చినా సాహిత్యానికి అంకితమై సేవ చేసినవి చాలా తక్కువ. మన లోపాలలో ముఖ్యమైన లోపం – కవుల, రచయితల, కళాకారుల ఫొటోలు, చేతి వ్రాతలు, కంఠధ్వనులు భద్రపరచకపోవటం!

బహుముఖ ప్రజ్ఞావంతుడు, 'ఆంధ్రా మేత్యూ అర్నాల్డ్' అయిన కట్టమంచి రామలింగారెడ్డిగారి పద్య రచనల్ని 1983లో మద్రాసులో "ది రెడ్డీస్" చక్కగా అచ్చువేశారు. వాళ్ళు చేసిన మంచి పని - తెలుగు, ఇంగ్లీషు భాషలలో కట్టమంచివారి దస్తూరిని గ్రంథస్థం చెయ్యడం. పై ఫొటోలో రామలింగారెడ్డిగారు స్వ దస్తూరితో ఉన్న రెండు పద్యాలను చూడవచ్చు.

"తల్లీ పార్వతి! మిమ్ము గొల్చిన నుదాత్తంబైన సౌఖ్యంబులన్
గొల్లాటంబుగ నిత్తువమ్మ......" అనేది మొదటి పద్యం







సాహితీసీమ అయిన కోనసీమకు నడిబొడ్డున ఉన్న అమలాపురంలో కవిపండిత సమ్మేళనాలు ఎన్నో జరిగాయి. ప్రసిద్ధ గేయకవి కందుకూరి రామభద్రరావు గారు ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేసినప్పుడు 6-4-1960న అమలాపురంలో కవిపండిత సభ జరిగింది. అందులో పాల్గొన్న హేమాహేమీలను పై ఫొటోలో చూడవచ్చు. ఎడమనుంచి మొదటి వరస -

1. విశ్వనాథ వారికి అక్షరాలా అంతే వాసి అయిన చెరుకుపల్లి జమదగ్ని శర్మగారు.
2. భావకవిత్వానికి 'దీపావళి'ని అందించిన వేదుల సత్యనారాయణశాస్త్రిగారు.
3. 'ఉపన్యాసకేసరి' చెరుకువాడ నరసింహం పంతులుగారు
4. అప్పటి విద్యాశాఖామాత్యులు ఎస్.బి.పి. పట్టాభిరామారావు గారు
5. 'ఎంత చక్కనిదోయి ఈ తెలుగు తోట' అని పరవశించిపోయిన కందుకూరి రామభద్రరావుగారు.
6. వదాన్యులు, పేరూరు జమీందారులు - జిల్లేళ్ళ భానోజీ రామర్సుగారు.
7. 'సౌందరనందం' జంటకవులలో - పింగళి లక్ష్మీకాంతంగారు.
8. ఆంధ్ర పురాణకర్త మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి గారు.
9. త్రివేణి పత్రికా సంపాదకులు - కోలవెన్ను రామకోటేశ్వరరావు గారు.

రెండవ వరుసలో - 1. వ్యాకరణ విద్వాంసులు కొర్లి అనంత పద్మనాభశాస్త్రి గారు 2. కాటూరి వెంకటేశ్వరరావు గారు







రాజమండ్రిలో 1922 లో ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలి (The Andhra Historical Research Society) స్థాపించబడింది. 1926 లో సంస్థ రిజిష్టరు చేయబడినప్పుడు ఆచార్య రాళ్ళ బండి సుబ్బారావుగారు గౌరవ సాధారణ కార్యదర్శిగా ఉండేవారు. చారిత్రకంగా ఈ సంస్థ చేసినసేవ నిరుపమానం. ఎన్నో చారిత్రక అవశేషాలను వెలుగులోకి తీసుకొచ్చి అలభ్య అముద్రిత రచనలను ప్రచురించిన ఈ సంస్థ రాజరాజ నరేంద్రుని వర్ధంత్యుత్సవాలను ఘనంగా నిర్వహించేది. ఒకనాటి ఆ ఉత్సవం నాటి ఫోటో ఇది. ఇందులో -

కూర్చున్నవారు - ఎడమనుంచి

1. భావరాజు వేంకట కృష్ణారావుగారు (మండలి కార్యదర్శి)
2. 'ఆంధ్రభీష్మ' న్యాపతి సుబ్బారావు పంతులుగారు
3. 'ఆంధ్రఆర్నాల్డ్' సి.ఆర్.రెడ్డిగారు (సభాధ్యక్షులు)
4. 'చరిత్రచతురానన' చిలుకూరి వీరభద్రరావుగారు.

నిల్చున్నవారిలో -

1. చరిత్ర పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
2. కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావుగారు (మండలి అధ్యక్షులు)



# The Chintamani.

## చింతామణి.

---

A Monthly Telugu Magazine

EDITED BY

**N. SUBBARAU B. A. & B. L.**

---

**Vol: III.—1893-94,**

---

RAJAHMUNDRY.

PRINTFD AT THE VIVEKAVARDHANI PRESS

1894.





కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'ఆధునిక సాహిత్య నిర్మాత' అనటానికి మరొక సాక్ష్యం "చింతామణి" పత్రికా నిర్వహణ. 1890లో కందుకూరి వారి నిర్వహణలో ప్రారంభించబడిన 'చింతామణి' పత్రికకి 'ఆంధ్రభీష్మ' న్యాపతి సుబ్బారావుగారు సంపాదకులుగా ఉండేవారు.

ఎన్నో అముద్రిత కావ్యాలను వెలుగులోకి తీసుకువచ్చిన పత్రిక - చింతామణి! కందుకూరి 'చింతామణి' ద్వారా చేసిన సేవ ఎంతో విలువైనది. అందుకే నిడదవోలు వెంకటరావు గారిలా అన్నారు -- "He was also the first to conceive the idea in 1892 of a prize for writing a novel. The prize winning novels were printed in the Chintamani. It is only an account of this encouragement that Chilakamarti began his career as a novelist!"

నవలల పోటీ సిర్వహించడం -- పోటీలో బహుమతి పొందిన నవలను సీరియల్‌గా ప్రచురించడం చింతామణితోనే ప్రారంభమైంది! 'చింతామణి' పత్రికకి ఇది శతజయంతి సంవత్సరం!



Registered No. M. 1647 చందా. రు. 2—8—




1 వ సంపుటము { ది 1 డిశెంబరు 1922 { 5 వ సంచిక.

మచిలీపట్టణము —కృష్ణాజిల్లా

కోసూరు గురునాథమూర్తి, సంపాదకుడు.

'తెలుగు వాళ్ళకి మనసారా నవ్వుకోవటం రాదు' అనే మాట లేకపోలేదు. అయితే తెలుగు సాహిత్యానికి వస్తే హాస్యం పాలు తక్కువనే చెప్పాలి. చాటువుల్లోనూ, ప్యారడీల్లోనూ హాస్యం కనిపిస్తుంది. తెలుగులో సాహిత్య పత్రికలకే మనుగడ లేనప్పుడు హాస్యపత్రికలకు ఎక్కడినుంచి ఆదరణ లభిస్తుంది. ఇప్పుడు మనకు సరియైన హాస్యపత్రికే లేదు. 1921లో మచిలీపట్నం నుంచి కోసూరు గురునాథ మూర్తి గారి సంపాదకత్వంలో "నవ్వుల తోట" అనే హాస్య మాస పత్రిక వెలువడేది. సంవత్సర చందా అప్పట్లో రెండున్నర రూపాయలు!

"సిరిమించు రతనాల హారంబుకన్న
మేడలో నివసించి మిడుగుట కన్న
ధరణిలో ధనమును దాచుట కన్న
నవ్వుటే నవ నవానందంబు మీకు

అని హితవు పలికినా – ఆ హాస్య పత్రిక ఎక్కువకాలం నడవలేక పోయింది (బహుశా సంపాదకులకు ఆర్థికంగా దుఃఖ భారాన్ని కలిగించిందేమో!)







పై ఫొటోలో కనిపించే వ్యక్తి -- "ఏ సాహితీ ప్రక్రియలోనైనా స్వతంత్ర ప్రతిభావంతుడు. నవ్వులలో అతి నవ్వుడు. జీవితంలోనూ సాహిత్యంలోనూ అరాచకం (anarchy) ఆయనకు పర్యాయవాచకం" అని కె.వి. రమణారెడ్డి గారి చేత బేరీజు వేయించుకున్నవాడు.

శ్రీశ్రీకి సహచరుడు. కొడవటి గంటికి బంధువట! "సిపాయి కథలు" ద్వారా ఉత్తమ కథకుడయ్యాడు. ఇంతకీ పై ఫొటోలో కనిపించే ఆ ప్రతిభావంతుడు - శిష్ట్లా ఉమామహేశ్వరరావు (1912-1952).

ప్రస్తుతం ఆధారాలు లభిస్తున్నంత వరకు-అరవై ఏళ్ళ వచన కవిత్వానికి శిష్ట్లా ఉమామహేశ్వరరావే ఆద్యుడు. 1928-30 ల మధ్యనే శిష్ట్లా వచన కవిత రచించినట్టు పరిశోధకులు చెప్పారు.





"ఈ విధినే(జిరంబుగ వరించిన మూర్తులు లోక దృష్టి కెం
తే వెడచేసి వైచెను మదీయ కృతార్ధత పెంపునాదు సం
భావనమెల్లి నొక్క లఘుపాత్రమునందునె ముంచి వైచెదిక్
ప్లావితమౌ యశంబు నొక పాటకె అమ్ముడుపుచ్చెనంతయున్"

– ఈ పద్యాన్ని మహాప్రస్థానం అంకితం చేయబడిన కొంపెల్ల జనార్ధనరావు రాసింది. ఉమర్ ఖయ్యామ్ గురించి రాసిన ఈ పద్యం కొంపెల్ల జనార్ధనరావు (కొం.జ) నిర్వహించిన ఉదయిని పత్రికలోది. ఈ పద్యానికి భావానుగుణంగా చెన్నపురి వాస్తవ్యుడు డబ్ల్యూ.ఎ. ఆర్యదాసు గారి చేత పై చిత్రాన్ని గీయించాడు. పత్రికకు ఒక స్థాయిని తీసుకురావటానికి జనార్ధనరావు చేసిన కృషికి ఇది నిదర్శనం.





సాహిత్య సేవే పరమార్థంగా సాహిత్య సభలు, వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తూ సాహిత్యాభిమానుల సహకారంతో లలిత కళాభివృద్ధికి పాటుపడుతున్న - విశాఖ రచయితల సంఘం 1950 లో ప్రారంభించబడింది. పురిపండా అప్పలస్వామి గారు చాలాకాలం ఈ సంస్థకి అధ్యక్షులుగా ఉన్నారు. పేరుకు ప్రాంతీయమైన - ఈ సంస్థలో పలువురు వివిధ ప్రాంతాలకు చెందిన రచయితలు సభ్యులుగా ఉన్నారు.

పై ఫొటో 14.8.55 నాడు విశాఖ రచయితల సంఘంలోని కార్యవర్గ సభ్యులు తీయించుకొన్నది. ఇందులో – ఎడమనుంచి – శ్రీయుతులు

1. గణపతిరాజు అచ్యుతరామరాజు
2. మసూనా
3. రావిశాస్త్రి
4. కాళీపట్నం రామారావు
5. బలివాడ కాంతారావు
6. ఇచ్ఛాపురపు జగన్నాథరావు
7. కె.వి. రమణ
8. కొర్లపాటి శ్రీరామమూర్తి గారలను చూడవచ్చు.



# పోటీ బహుమానము




| | |
|---|---|
| గురుజాడవారి | 'కన్యాశుల్కము' |
| ధర్మవరమువారి | 'చిత్రనళీయము' |
| చిలకమర్తివారి | 'గయోపాఖ్యానము' |
| కాళ్లకూరివారి | 'చింతామణి' |
| వేదమువారి | 'ప్రతాపరుద్రీయము' |
| శ్రీపాదవారి | 'బొబ్బిలియుద్ధం' |
| బలిజేపల్లివారి | 'హరిశ్చంద్ర' |

ఈ నాటకము లేడింటిలో మీ మొదటి, రెండవ మూడవ, నాలుగవ, ఐదవ, ఆఱవ, ఏడవ, వోటును క్రమముగా దేనికి దేనికి ఇత్తురో నిర్ణయించుకొని, ఆవోటు నెంబర్లు పైన వ్రాయబడియున్న ఆయా నాటక నామముల కెదురుగ వ్రాసి; పుస్తకముల బొమ్మక్రింద నెదురుగ తమనామము, చిరునామా వ్రాసి; ఈ కాగితమును కవరులో పెట్టి రెండుఅణాల పోస్టుబిళ్ళలతో సహా, సెప్టెంబరు 10-వ తేదీలోపల మా కార్యాలయమునకు పంపవలెను. తరతమభేదమున ఏయే నాటకమునకు ఏవోట్లు హెచ్చుగవచ్చినవో లెక్కించి మొత్తముమీద ఈ గణనకు సరిపోవునట్లుగాని, సమీపించునట్లుగాని వోటువైచి పంపినవారలలో మొదటి ఇరువురకును చెరియొక రత్నాఫవుంటెన్ పెన్ను బహుమానముగ ఈయబడును. ఒక్కొక్క కలము విలువ సుమారు నాలుగు రూపాయిలు. ఇందు పలువురి గణనము ఒకే మాదిరిగా నుండుచో చీట్లువేసి బహుమానార్హుల నిరువురి నెంచుదుము. ఈ కాగితముపై ఆంధ్రభూమి రబ్బరుస్టాంపు, నెంబరు, మేనేజరు సంతకము లేనిది పోటీపరీక్షలో నిది పర్యాలోచింపబడదు. ఇందు బహుమానార్హులుగ నిర్ణయింపబడిన వారి నామములు పైమాసపు ఆంధ్రభూమిలో ప్రచురించి అనంతరము వారి బహుమానములు వారికి పంపుదుము. ఈ విషయమై ఎట్టి ఉత్తరప్రత్యుత్తరములును జరుపబడవు.

ఆంధ్రభూమి కార్యాలయము, వేపేరి, మదరాసు.



అరవై ఏళ్ళ క్రితం ఆంధ్రశేషగిరి రావు గారు మద్రాసునుంచి "ఆంధ్ర భూమి" మాసపత్రికను నిర్వహించేవారు. సాహిత్యంతోపాటు వివిధ విషయాలకు కూడా ప్రాధాన్యం ఇచ్చే 'ఆంధ్రభూమి' పాఠకుల కోసం విచిత్రమైన పోటీలు నిర్వహిస్తూ ఉండేది. సాహిత్య పాఠకులకు ఒక వినూత్నమైన పోటీని నిర్వహించడం పై ఫోటోలో కనిపిస్తుంది.

కన్యాశుల్కం, గయోపాఖ్యానం, చింతామణి, బొబ్బిలి యుద్ధం, హరిశ్చంద్ర, ప్రతాపరుద్రీయం, చిత్రనళీయం నాటకాలకు ఆ రోజుల్లో బాగా ప్రసిద్ధి ఉండేది. అయితే వాటిల్లో ఏవి ఉత్తమమైనవి అనే పోటీ ఆంధ్రభూమి నిర్వహించింది. ప్రథమ, ద్వితీయ స్థానాలకు యోగ్యమైన నాటకాలను సూచించమని పాఠకులను కోరింది. విజేతలకు నాలుగు రూపాయలు ఖరీదుగల రత్నాఫౌంటెన్ పెన్నులు బహుమానంగా ప్రకటించారు. (అయితే పోటీ ఫలితాలు మాత్రం లభ్యం కాలేదు)





"కందుకూరి, గిడుగు, గురజాడల భూస్వామ్యవ్యతిరేక ప్రజాస్వామిక సాహిత్యవారసత్వాన్ని సామ్యవాదోన్ముఖంగా తీసుకు వెళ్ళి తెలుగువాళ్ళ సాంస్కృతిక పురోగమనానికి దోహదం చేసిన ఉత్తమ సాహిత్య స్రష్ట - కొడవటిగంటి కుటుంబరావు" అని పలికిన ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారి మాటల్లో నిజం లేకపోలేదు.

1909లో జన్మించిన కొడవటిగంటి కుటుంబరావుగారు 1924లో ఉపనయనం చేసుకున్నారు. మరుసటి సంవత్సరంలోనే - అంటే 1925లో బాల్యవివాహం జరిగింది. కొల్లూరు గ్రామస్థులైన మెట్టా వెంకటరత్న శాస్త్రి, సీతమ్మల కుమార్తె పద్మావతిని కొడవటిగంటి వివాహమాడారు. అప్పుడు పెళ్ళికూతురు వయసు పదకొండు సంవత్సరాలు కాగా - కుటుంబరావుగారి వయస్సు పదహారు సంవత్సరాలు! ఆ వివాహంనాటి మధురస్మృతిని తెలిపేదే పై ఫోటో!







తెలుగు సాహిత్యానికి సంస్థానాల వల్ల జరిగిన మేలు మరవరానిది. సంస్థానాధీశ్వరుల పోషణవల్లనే ఎన్నో గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. ఎందరో పండితులు, కవులు సుప్రసిద్ధులయ్యారు. అటువంటి సంస్థానాధీశ్వరులలో ఒకరైన పిఠాపురం మహారాజా శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యరాయ బహద్దర్ గారిని పై ఫొటోలో చూడవచ్చు.

గ్రాంథిక భాషా రక్షణకు కొమ్ము కాసిన "ఆంధ్ర సాహిత్య పరిషత్తు"కు సూర్యరాయ బహద్దర్ వారు ప్రధాన పోషకులు. రసజ్ఞ చక్రవర్తులు. కృతిభర్తలు. ఎన్నో గ్రంథాలను ముద్రింపజేశారు. కవి పండితుల్ని పోషించారు. సంప్రదాయ సాహిత్య ప్రచారానికి, అభివృద్ధికి తోడ్పడటం ఒక ఎత్తు. తెలుగు భాషకు అమూల్యమైన "సూర్యరాయాంధ్ర నిఘంటువు" నిర్మాణానికి సహకరించటం ఒక ఎత్తు. ఆ నిఘంటువు తెలుగు భాషకు అత్యంత అవసరమని గుర్తించి ఆర్థిక సహాయాన్ని అందించిన సూర్యరాయ బహద్దర్ వారు ధన్యజీవి.







ఈ ఫొటోలో కనిపించే ఇద్దరూ ఆదర్శ దంపతులు. పేర్లు చెప్పేస్తే – మనకి సుపరిచితులే!

నూరు సంవత్సరాల నాటి వేషధారణలో ఉన్న వీరిద్దరూ సామాజిక సేవలో జీవితాన్ని వెళ్ళబుచ్చారు.

సమాజంలోని మౌఢ్యాన్ని, అంధకారాన్ని పారద్రోలిన సంఘ సంస్కర్త - కందుకూరి వీరేశలింగం పంతులు గారిని - వారి అర్ధాంగి రాజ్యలక్ష్మమ్మ గారిని ఈ చిత్రంలో చూడవచ్చు.

అర్ధాంగి సహకారం లేకపోవడం వల్ల ఎందరో వెలుగులోకి రాలేకపోవటం - అనుకున్నది సాధించలేక పోవటం జరుగుతుంది. కందుకూరి వారికి అనుకూలవతియైన భార్యగా రాజ్యలక్ష్మమ్మ గారు లభించటం పెద్ద ప్లస్ పాయింట్!

"రాజ్యలక్ష్మమ్మగారు లేకపోతే కందుకూరి వారు అంతటి మహత్తర కార్యక్రమాల్ని చేయగలిగే వారు కారేమో" అన్న కనుపర్తి వరలక్ష్మమ్మ గారి మాటల్ని మనం మననం చేసుకోవాలి.







"సంగ్రామం మన శత్రువు
లోక శాంతి మన గమ్యం
జగదేక మహోద్యమం
జయిస్తుంది నిశ్చయం
మానవోన్నతాదర్శ ప
తాక భువిని నిలుస్తుంది"

అనే బృందగాన దృశ్యాన్ని పై ఫొటోలో చూస్తున్నారు. ఈ దృశ్యం అభ్యుదయ కవి, నాటకకర్త శ్రీ అనిసెట్టి సుబ్బారావు రచించిన "శాంతి" అనే విశిష్ట నాటకంలోది.

దీనిని తొలి మూక నాటికగా పేర్కొంటారు.

యుద్ధాలవల్ల జరిగే నష్టాలు వివరిస్తూ, శాంతి ఆవశ్యకతను బోధించే ఈ నాటిక "అభ్యుదయ కళాసమితి" ద్వారా ఆంధ్ర దేశం అంతటా 1951-65 ప్రాంతాలలో ప్రదర్శితమై విశేషమైన ఆదరణ పొందింది. తమిళ, మలయాళ భాషలలోకి అనువాదం కావటం, సోవియట్ ఫిల్ము ప్రతినిధివర్గంచే వర్ణ చిత్రంగా రూపొందింపబడి రష్యాలో ప్రజాదరణ పొందటం 'శాంతి' నాటక వైశిష్ట్యాన్ని వెల్లడిస్తాయి.







1909 - 1984

ఒక విధంగా తెలుగునాట వెలసిన పూర్తిస్థాయి సాహిత్య సంస్థలలో తొలిసంస్థగా "ఆంధ్ర భాషాభి వర్ధనీ సమాజాన్ని" పేర్కొనవలసి వుంటుంది. మాతృభాషాభిమానం సంఘసేవానిరతి, అభ్యుదయ వాంఛల ప్రాతిపదికగా 'బ్రహ్మపురం' అనే పేరుగల బరంపురంలో (అప్పట్లో గంజాం జిల్లాలో ఉండేది) ఈ సంస్థ 1909 లో జనవరి 1న స్థాపించబడింది. ఆదిభట్ల తరణయ్య సిద్ధాంతి, ఆదిభట్ల వెంకన్న, కోరుకొండ జగజ్జనరావు, బచ్చు జగన్నాథదాసు, ఊటకూరి గోపాలరావు, పూడిపెద్ది సూర్యనారాయణ వంటి మహానుభావులు ఈ సంస్థను స్థాపించారు. భోగరాజు నారాయణమూర్తి, తాపీ ధర్మారావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి వంటివారు ఇందులో సభ్యులుగా ఉండేవారు. సాహితీ సదస్సులు, గ్రంథాలయ నిర్వహణ, స్త్రీవిద్య వంటి కార్యక్రమాలు చేపట్టి ఆంధ్ర ఉత్కళ కళా సంస్కృతుల సమ్మేళనకు అభివృద్ధికి ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం పాటుపడింది. గిడుగు, గురజాడ, కందుకూరి, కట్టమంచి, పానుగంటి మొదలైనవారు ఈ సంస్థ కార్యకలాపాలలో పాల్గొన్నారు. నేటికీ సారస్వత సేవ చేస్తున్న ఈ సంస్థను ప్రశంసించవల్సిందే.

SUKLAPAKSHAM * * * * SUKLAPAKSHAM

Dedicated

IN

RESPECTFUL ADMIRATION

TO

THE EVER-ABIDING SPIRIT

OF

**TENALI RAMALINGA KAVI**

WHO

*WHILE HE SOJOURNED ON THIS LOWER PLANE*

WAS

An Apostle of Sincerity

An Advocate of Aestheticism

A Critic of Cant

A Champion of Grace

A Challenger of Charlatanism

A Prince among Parodists

A Sovereign among Satirists

AND

*The Dean of the Faculty of*

*The Quizzical Art*

IN

*Telugu Letters*

*A. Ramalingaswamy,*

*Author.*

SUKLAPAKSHAM * * SUKLAPAKSHAM



1-8-1890లో పార్వతీపురంలో జన్మించిన అనంతపంతుల రామలింగస్వామిగారు 'భువనవిజయము', 'భార్గవ రామాయణము', 'హితబోధ' వంటి రచనలు చేసినా గుర్తింపు రాలేదు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "కృష్ణపక్షానికి వ్యతిరేకంగా - భావకవిత్వాన్ని హేళన చేస్తూ రాసిన శుక్లపక్షానికీ ప్రాచుర్యం లభించింది. "శుక్లపక్షములోని కవితలు కొన్ని పత్రికలలో ప్రకటితమయినపుడు చదివి చాలా సంతోషించినాను. ఓహో, క్రొత్త తెలుగు కవిత ఆవిర్భవించిందే?" అని అనుకున్నాను" అని – గిడుగువారు వ్యాఖ్యానించారు.

అనంతపంతుల రామలింగస్వామిగారు తమ "శుక్లపక్షం" కావ్యాన్ని తెనాలి రామలింగకవికి అంకితమివ్వటం విశేషం. అంకితమిస్తూ ఇంగ్లీషులో రాసిన తీరు మరీ విశేషం. అనేక విధాలుగా తెనాలిరామలింగకవిని కీర్తిస్తూ చివరగా "The Dean of the Faculty of the Quizzical Art in Telugu Letters" అని అంటారు.



(1) మహాశ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రులవారికి
నమస్కారాభివందనములతో సమర్పణ -

బావగారూ!

నాటిక సంపుటిగా వెలువడనున్న
'మువ్వగోపాల' అనేది ప్రకాశకుల కోసం
ఇచ్చేసాను. దాన్ని చూసి మీ ఒడుపులు కొన్ని దొంగ
కొట్టేసానని మీరనద్దు. అవును. పదిహేనేళ్ళుగా
మీ స్నేహం చేసినందుకు మీ నాటికల గుబాళిం-
పులు, మీ పద్యాల నాజూకుపులు, మీ పాటల
ఒడుపు వాక్యములు.- నేటికి నా మెదిలిన మీ
ఆలోచన ప్రతిభా పట్టు పడక పోయినా, ఏదో
మీ వాసన కొంచెం తగిలింది కనుకనే- ఒక్కొక్క
ఒక్క పస్తకు పన్నెండు అప్పుడప్పుడుగా మరి నాలు నాటి-
కలు వ్రాసాను. ఇవి మీకు మెప్పు గూర్చవని కాదు
గాని నేపటి మీ పుట్టిన నాటి పండగకైనా కానుకగా
గ్రహిస్తారని నేడు వీటిని మీకు అంకితం చేస్తాను.

కాటూరు
30.10.61

చిత్తగించండి,
కాటూరి వెంకటేశ్వరరావు.



కావ్యాలు, గ్రంధాలు అంకితమివ్వడం సాధారణమైన అంశమే. అయితే అంకితాలు ఇవ్వడంలో కూడా వింతలు చోటు చేసుకోవటం గమనించవచ్చు. మహాప్రస్థానాన్ని కవితద్వారా జనార్ధనరావుకి అంకితమిచ్చాడు శ్రీ శ్రీ. అంకితం ఇచ్చేటప్పుడు రాసే రాతలు పరిశీలించదగినవి.

వైచిత్రంలో కాటూరి వెంకటేశ్వరరావుగారు దేవులపల్లి కృష్ణశాస్త్రులవార్కి నాటికలసంపుటి "మువ్వగోపాల"ను అంకితమిస్తూ స్వ దస్తూరితో రాసిన తీరు హృద్యంగా – వారి బాంధవ్యానికి గుర్తుగా వుంది.





ఈ చిత్రంలో కనిపించే వ్యక్తి - రాజమహేంద్రవరపుజిల్లా ఫస్టుక్లాస్ డిస్ట్రిక్టు మునసబుగా పనిచేశారు. ఈయన 1862లోనే వ్యావహారిక భాషలో "హితసూచని" అనే వచన గ్రంథం రాసిన ప్రతిభాశాలి.

ఈ గ్రంథం 1862 జూలైలో మద్రాసు జ్యోతిష్క_ళానిధి ముద్రాక్షరశాలలో మొదటిసారిగా అచ్చయింది. ఈ 'హితసూచని' ని పునర్ముద్రించాలని ముద్దుకృష్ణగారు ప్రయత్నించారు. కానీ సఫలీకృతులు కాలేకపోయారు. రాజమండ్రిలోని 'ఆంధ్రకేసరి యువజనసమితి' వారి దీక్షాదక్షతల వల్ల 1986లో దీనికి ఆరుద్ర ప్రవేశికతో పునర్ముద్రణ భాగ్యం లభించింది. ఇంతకీ పై చిత్రంలో కనిపించే ప్రజ్ఞావంతుడు - స్వామినీన ముద్దు నరసింహ నాయని వారు!

" వ్యావహారిక భాష ప్రయోజనాన్ని గుర్తించి ఆ ·వాదాన్ని ప్రారంభించినవాడు ఈ ముద్దు నరసింహం. అంతేకాదు. సంఘసంస్కా_రము, వితంతు వివాహము, బ్రహ్మసమాజము ద్వారా బంగాళాదేశం నుంచి ఆంధ్రదేశంలోకి దిగుమతి కావడం కాదు - అంతకు పూర్వమే మన తెలుగు వాడొకడు ఈ ఉద్యమాన్ని తలపెట్టి ప్రచారం చేసినవాడున్నాడు అని బుజువు చేయడానికి ఈ హితసూచని ఆధారం" అని గిడుగు రామమూర్తిగారు మెచ్చుకున్నారు.



# అశ్రుగీతి (బెంగాలుకఱవుగేయం)





సామవేదం జానకిరామశర్మ

"కలకత్తాలో/కాళీదేవి
విలయతాండవం/విన్నారా?
ఆకలిమంటల/కాహుతి అయ్యే
అనాథజీవుల/కన్నారా?"

-- ఇది బెంగాలు క్షామ వృత్తాంతాలు విని నలభై అయిదేళ్ళ క్రితం రాసిన "అశ్రుగీతి" అనే దీర్ఘ కవితలోది. 1946లో సాహిత్య మండలి, ఏలూరువారు ఈ కవితను ప్రచురించారు. "కవిప్రతిభాశాలి అయితే, ఏ వస్తువైనా ఆయన చేతిలో జాతిరత్నంగా మారుతుందనే సిద్ధాంతానికి ఈ గేయం ఒక ఉదాహరణ" అని ఎంకిపాటల నండూరివారు కితాబు ఇచ్చారు.

"అన్నం కోసం/అటమటించుతూ
అసువుల/వీడిన
అభాగ్యజీవికి"

అంకితం ఈయబడిన 'అశ్రుగీతి' ని రచించింది సంప్రదాయ పద్యకవియైన సామవేదం జానకిరామశర్మగారు.



(Courtesy : Carrey library, Serampore)



జర్మన్ దేశీయుడైన బెంజమిన్ షూల్జి (Benjamin Schultze) 1689లో జన్మించాడు. ఇతనిని ప్రథమాంధ్ర గ్రంథ ప్రచురణకర్తగా పరిశోధకులు నిర్ణయించారు. 1742 నాటికి భారత దేశంలో తెలుగు మినహా మిగిలిన భాషల్లో గ్రంథ ముద్రణ జరుగుతుండేది. 1746లో షూల్జి జర్మనీలోని హాలె నగరంలో తొలితెలుగు గ్రంథంగా పేర్కొంటున్న "మోక్షానికి కొంచ్చు పొయ్యే దొవ" అనే క్రీస్తవమత గ్రంథాన్ని ముద్రించాడు. ఇదికాక మరి మూడు గ్రంథాలు కూడా ముద్రించాడు. వాటిలో ఒక గ్రంథం పై చిత్రంలో కనిపిస్తుంది. ఈ గ్రంథం పేరు

"బుద్ధి కలిగిన తెలుగువాండ్ల లొపల వొకడొకడికి పుణ్యపుదోవ చూపించ్చె

నూరు జ్ఞానవచనాల యొక్క చిన్న పుస్తకం"

పారమార్థికచింతనకూ, సన్మార్గవర్తనానికి వలసిన హితవచనాలు గల ఈ గ్రంథం షుల్జీస్వీయరచన.







తెలుగుకవులలో రంధిసోమరాజుగారు విశిష్టకవి.

"ఎన్నుకున్న వస్తువే అలాంటిది. రంగురంగుల లైట్ల మధ్య స్వర్మావరిష్వంగాల రక్త స్న్నాక్ రాసకేళుల మధ్య వేలంపాట పాడే విలాసినీ నాగరికత అది" అని సినారె గారు ప్రశంసించిన "రోజీ" కావ్యం. రంధిసోమరాజు కవితాప్రతిభకు నిదర్శనం.

కవితలలోని భావానికి అనుగుణంగా చిత్రాలు గీయటం మనకున్న అలవాటే.

"నాకళ్ళు నా వొళ్ళు నానటన నా గొంతు
నాకు తరగని ట్రెజరీరీ
నాను కదిలితే సాలు
జనం గోదారీలా ప్రవహించిపోతారు"
వంటి భావాలు ఎన్నోగల రోజీ కావ్యంలోని సారాంశాన్ని –
పై చిత్రం ద్వారా మన కళ్ళ ముందుంచారు 'బాపు'!
కావ్యం చదివితే బాపుచిత్రం చూసి 'బాపురే' అంటాం!





సహజకవి-ప్రజాకవి వంటి పదాలు చాలామందికి వాడుతుంటారు. కానీ - అవి అంతగా నప్పవు.

ఈ మాటలు మెదక్ సమీపంలో "తూపురాన్" గ్రామంలో పుట్టి పాలకుల గుండెల్లో గుబులు పుట్టిస్తున్న గుమ్మడి విఠల్‌కే చక్కగా వర్తిస్తాయి.

ఇంతకీ ఈ విఠల్ ఎవరో కాదు - గద్దర్!

'గద్దర్' అనేది పంజాబ్‌లో ప్రసిద్ధి చెందిన విప్లవపార్టీ పేరు.

ఆ పేరే విఠల్ పేరుగా మారిపోయింది.

"సిరిమల్లె చెట్టుకింద", "బండెనకబండికట్టి", "గ్యాంగోళ్ళమండిబాబు" వంటి పాటలు గద్దర్ గజ్జెకట్టి - భావలయ వేస్తూ - సొంత వ్యాఖ్యానాలు జోడిస్తూ పాడుతూంటే -

విప్లవవ్యతిరేకులైనా - సిద్ధాంతాలు గిట్టనివారైనా - ఆ పాట వినేవాళ్ళు పాడేవాళ్ళుగా మారిపోతూంటారు.

అంతటి శక్తిగల గద్దర్ ఆవేశంగా పాడుతున్నప్పటి దృశ్యాన్ని పై చిత్రంలో చూస్తారు.







"తమ శక్తులను స్త్రీల సమస్యలపై కేంద్రీకరించి, సంఘం వారిపట్ల ప్రదర్శిస్తున్న వైఖరికి విసిగి - మనలో ఏర్పడిన ద్వంద్వ ప్రమాణాలకు ఆగ్రహించి, మనల్ని సంస్కరించడానికి అంకురిత దీక్షతో పోరాడిన వీరులుగా వీరేశలింగం, గురజాడలతోపాటు పై ఫోటోలో కనిపించే వ్యక్తిని కూడా చేర్చారు పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు.

పై చిత్రం పిల్లల బొమ్మలాట మాదిరిగా కనిపిస్తోంది. కాని బాల్యవివాహాలు జరుగుతున్న కాలంనాటి పెళ్ళి ఫోటో ఇది. ఇందులో కనిపించే పెళ్ళికొడుకు 1894లో పుట్టాడు. పెళ్ళికూతురు బెజవాడ వాస్తవ్యులైన ఉప్పలూరి రామశేషయ్యగారి కుమార్తె. ఈ అపూర్వ చిత్రం, "తెలుగు వెలుగు - చలం" అనే పుస్తకంలో కనిపిస్తుంది.

ఇందులో కనిపించే పదహారేళ్ళ వయసు గల పెళ్ళికొడుకు చలం! పెళ్ళికూతురు రంగనాయకమ్మ. ఇది 1910 నాటి పెళ్ళి ఫోటో!



# Manifesto of the Indian Progressive Writers' Association, London

RADICAL changes are taking place in Indian society. Fixed ideas and old beliefs, social and political institutions are being challenged. Out of the present turmoil and conflict a new society is arising. The spirit of reaction, however, though moribund and doomed to ultimate decay, is still operative and is making desperate efforts to prolong itself.

It is duty of Indian writers to give expression to the changes taking place in Indian life and to assist the spirit of progress in the country.

Indian literature, since the breakdown of Classical culture, has had the fatal tendency to escape from the actualities of life. It has tried to find a refuge from reality in spiritualism and idealism. The result has been that it has produced a rigid formalism and a banal and perverse ideology. Witness the mystical-devotional obsession of our literature, its furtive and sentimental attitude towards sex, its emotional exhibitionism and its almost total lack of rationality. Such literature was produced particularly during the past two centuries, one of the most unhappy periods of our history, a period of disintegrating feudalism and of acute misery and degradation for the Indian people as a whole.

It is the object of our association to rescue literature and other arts from the priestly, academic and decadent classes in whose hands they have degenerated so long; to bring the arts into the closest touch with the people; and to make them the vital organs which will register the actualities of life, as well as lead us to the future.

While claiming to be the inheritors of the best traditions of Indian civilization, we shall criticize ruthlessly, in all its political, economic and cultural aspects, the spirit of reaction in our country; and we shall foster through interpretative and creative work (with both native and foreign resources) everything that will lead our country to the new life for which it is striving. We believe that the new literature of India must deal with the basic problems of our existence to-day—the problems of hunger and poverty, social backwardness and political subjection, so that it may help us to understand these problems, and through such understanding help us to act.

With the above aims in view, the following resolutions have been adopted:—

(1) The Establishment of organizations of writers to correspond to the various linguistic zones of India; the co-ordinations of these organizations by holding conferences, publishing of magazines, pamphlets, etc.

(2) To co-operate with those literary organizations whose aims do not conflict with the basic aims of the Association.

(3) To produce and to translate literature of a progressive nature and of a high technical standard, to fight cultural reaction; and, in this way, to further the cause of Indian freedom and social regeneration.

(4) To strive for the acceptance of a common language (Hindustani) and a common script (Indo-Roman) for India.

(5) To protect the interests of authors; to help authors who require and deserve assistance for the publication of their works.

(6) To fight for the right of free expression of thought and opinion.

(This manifesto has been signed by Dr. Mulk Raj Anand, Dr. K. S. Bhat, Dr. J. C. Ghose, Dr. S. Sinha, M. D. Taseer, S. S. Zaheer.)

All communications to be addressed to Dr. M. R. Anand, 32 Russell Square, London, W.C.1.

London, 1935.



తెలుగు సాహిత్యాన్ని విశిష్టమైన మలుపు తిప్పిన ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం 1943లో నెలకొల్ప బడినా 1935లోనే అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపించబడింది. 1935లో ఉన్నతవిద్యలకోసం ఇంగ్లండులో ఉన్న కొంతమంది యువకులు సామ్యవాదానికి ప్రభావితులై "ఇండియన్ ప్రొగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్, లండన్" అనే సంస్థను ప్రారంభించారు. దీనిని ప్రారంభించినవారిలో డా. ముల్క్‌రాజ్ ఆనంద్, డా.కె.ఎస్. భట్, డా. జె.సి. ఘోష్ మొదలైనవారున్నారు. వీళ్ళు "Manifesto of the Indian Progressive Writers' Association, London" అని ఒక ప్రణాళికను విడుదల చేశారు. ఈ మానిఫెస్టో మొదటిసారిగా ఇంగ్లండ్‌లోని వామపక్ష పత్రిక - "లెఫ్ట్ రివ్యూ"లో ప్రచురించబడింది. ఈ మానిఫెస్టో అభ్యుదయ ఉద్యమానికి నాంది పలికింది. శ్రీశ్రీ ఈ మానిఫెస్టో చేత ప్రభావితుడయ్యాడు.

